## గంటల పంచాంగం

శ్రీ విజయ సం॥ మార్గశిర బ॥ చవితి 1953 సం॥ డిశంబరు 10 గురువారం బ॥ చవితి ప 8-18 · ఉ షా ప 10-8 వర్జ్యం ప 2-4 ల 3-38 కు.

బ॥ పంచమి డిశంబరు 11 శుక్రవారం బ॥ పంచమి ప2-8 శ్రవ ప 9-46 వర్జ్యం ప 1-28 ల 8-11 కు.



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు తా నొరులకు నవిసేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్ (మహాభారతము)

శ్రీ విజయ సం॥ మార్గశిర బ॥ చవితి
గురువారం

## బెర్ముడా సమావేశం

"సోవియట్ రష్యా చిత్తశుద్ధి నిరూపణ కావాలి. అంతవరకూ అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల సమావేశానికి అమెరికా అంగీకరించదు." అనే ధోరణిలో అమెరికా విదేశాంగశాఖ కార్యదర్శి జె. యఫ్. డల్లెస్ రష్యా కదిపటి ప్రతిపాదనపై వ్యాఖ్యానించారు. ఈ వైఖరి ఏవిధంగానూ సమర్థనీయం గాదని, బెర్ముడా సమావేశం అమెరికా విదేశాంగ కార్యదర్శి వైఖరిలో మార్పు తీసుకురాగలదని క్రిందటివారం మేము ఆశించాము. బెర్ముడా సంప్రతింపులు ప్రపంచ సమస్యల పరిష్కారానికి సుగమమైన దగ్గిర దారిని ఏర్పాటు చేయగలదని ఎవరూ ఆశించలేదు పశ్చిమ రాజ్యాల మధ్య ఇటవల పొడచూపిన 'విభేదాల' పరిష్కారమే ఈ అగ్రనాయకత్రయ సమావేశ లక్ష్యం అని అందరూ గ్రహించారు. రష్యాతో ఏవిధంగా వ్యవహారం చేయాలి అనే విషయంలో బ్రిటన్, అమెరికా అధిపతులలో అభిప్రాయ భేదాలు ఏర్పడినవి. బ్రిటిష్ ప్రధాని మంత్రి సర్ విన్‌స్టన్ చర్చిల్ అమెరికా, ఫ్రాన్సు, రష్యా, బ్రిటన్ అధిపతుల సమావేశం జరగాలని, ప్రపంచంలో నేడేర్పడివున్న తీవ్ర పరిస్థితి, తీవ్రతను తగ్గించడానికి అదొక్కటే మార్గమని స్పష్టం చేస్తూ వచ్చారు. ఈ విధమైన అగ్రనాయక చతుష్టయ సమావేశానికి అమెరికా అధ్యక్షుడు సుముఖంగా లేడు. అగ్రనాయకుల సమావేశంగురించి ఐసెన్‌హోవరు-చర్చిల్ మధ్య ఏర్పడిన అభిప్రాయభేదాలు పశ్చిమ రాజ్యాల ఐకమత్యాన్ని విచ్ఛిన్నం చేయగల ప్రమాదంకూడా ఏర్పడింది బెర్ముడా సమావేశం ఆ ప్రమాదాన్ని నివారించింది అనిపించదు.

కాని, అగ్ర రాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల సమావేశంలో పాల్గొనడానికి అమెరికా అంగీకరించింది కనుక ఈ సమావేశం ఏమాత్రం ఫలప్రదమైనా అగ్రనాయక చతుష్టయ సమావేశం జరగడానికి పరిస్థితులు కొంతవరకు అనుకూలం కావచ్చును విదేశాంగ మంత్రుల సమావేశం విషయమై అమెరికా వైఖరిలో వచ్చిన మార్పు బ్రిటిషు ప్రధానమంత్రి, విదేశాంగ మంత్రి కృషి ఫలితమేనని అంగీకరించక తప్పదు. బెర్ముడా సమావేశం సాధించిన ఫలితాలలో ఇదొక్కటే ప్రత్యేకమైనది.

ముఖ్యమైన అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ, యూరపురక్షణసంఘం ముదలైన విషయాలపై బెర్ముడా సమావేశంలో జరిగిన 'నిర్ణయాలు' కేవలం పశ్చిమ రాజ్యాల ఐకమత్యానికి భంగం వాటిల్ల లేదని ప్రచారం చేయడానికి వుద్దేశించబడినవే. కాని బెర్ముడా సమావేశానంతరం వెలువడిన అధికార ప్రకటనను పరిశీలిస్తే యూరపు రక్షణ సంఘం విషయంలో సంపూర్ణమైన ఏకాభిప్రాయం లేదని స్పష్టమౌతుంది. బ్రిటన్‌గాని, ఫ్రాన్సుగాని ఆయుధ బలాన్ని వృద్ధిచేసుకోవడంపై ఒక పరిమితి లేక డబ్బు ఖర్చు చేయడానికి సుముఖంగా లేవు అమెరికా ఆర్థిక వ్యవస్థను రక్షించడానికి ఈ దేశాలు తమ ఆర్థికవ్యవస్థను బలి ఇవ్వడానికి సిద్ధంగా లేవు ప్రపంచ రాజ్యాలు ఆయుధోత్పత్తి కార్యక్రమానికి స్వస్తి చెప్పకలిగినాడు అమెరికా ఆర్థిక వ్యవస్థ దెబ్బ తినడం తథ్యం. కనుకనే అమెరికా అగ్రరాజ్య చతుష్టయ సమావేశానికి పూర్తిగా విముఖంగా వున్నది.

ఫ్రాన్సు యూరపు రక్షణ సంఘం విధించిన బాధ్యతలను నిర్వర్తించగల స్థితిలో లేదు. బ్రిటన్‌లో కన్సర్వేటివ్ ప్రభుత్వం రాబోవు ఎన్నికలలోపుం ప్రజల ఆర్థికస్థితిలో కొంత అభివృద్ధినైనా సాధింపవలసి వున్నది. ప్రపంచపరిస్థితి కుదిటబడినగాని, ఫ్రాన్సు, బ్రిటన్‌లు దేశాంగ వ్యవహారాలపై మనస్సును లగ్నంచేసి, దృష్టిని కేంద్రీకరించి వివిధ ఆర్థిక సాంఘిక సమస్యల పరిష్కారానికి పూనుకో లేవు. కనుకనే బ్రిటన్, ఫ్రాన్సు ప్రధాన మంత్రులు నేటి ప్రపంచ రాజకీయ పరిస్థితి తీవ్రతను తగ్గించడానికిగల అన్ని అవకాశాలనూ పరిశీలించాలని పట్టుదలగా వున్నారు. అందువల్లనే అమెరికా అగ్రరాజ్య విదేశాంగమంత్రుల సమావేశంలో పాల్గొనడానికి ఇప్పుడు సుముఖంగా వున్నది. జనవరి 4 న బర్లిన్ లో ఈ సమావేశం జరగాలని బెర్ముడా సమావేశం సూచించింది. ఆప్రకారం అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశం జరిగి జర్మనీ, ఆస్ట్రియా సమస్యల పరిష్కారంపై విదేశాంగ మంత్రులు సమాధానానికి రాకలిగిన అగ్రనాయకులు సమావేశమై ఈ సమస్యల, ఇతర సమస్యల పరిష్కారానికి పూనుకోగలరు.

సోవియట్ రష్యా బెర్ముడా ప్రకటనను విమర్శించడంతో, పశ్చిమరాజ్యాలపై ఆరోపణలు చేయడంతో కాలయాపన చేయక జనవరి 4 న బర్లిన్ సమావేశంలో పాల్గొనడానికి సమ్మతించిన క్రెమ్లిన్ చిత్తశుద్ధి నిరూపణ కాగలదు.

## ఆంధ్రప్రభుత్వ సెలవులు

రాబోవు సంవత్సరంలో ఆంధ్రప్రభుత్వం ఇవ్వదలచిన సెలవులను తెలుపుతూ మంగళవారం వెలువడిన అధికార ప్రకటన ఆంధ్రులందర్నీ ఆశ్చర్యచకితులను చేసింది. అక్టోబరు 1 రాష్ట్రావతరణ దినం ఆ రోజు ఆంధ్రులందరికీ వారు రాష్ట్రంలో వున్నా, రాష్ట్రం వెలుపల వున్నా పండుగరోజు మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు మద్రాసు శాసన సభలు ఆంధ్ర బిల్లును చర్చిస్తున్న సమయములో అక్టోబరు 1 ని ఆగస్టు 15తో పోల్చారు. భారతీయులకు ఆగస్టు 15 ఎంతటి సంతోషదాయకమైన పండుగరోజో ఆంధ్రులకు అక్టోబరు 1 అట్టిపండుగరోజు కాగలదని వారు ఆసందర్భంలో ప్రకటించారు. అయినా ఆంధ్ర రాష్ట్రప్రభుత్వం అక్టోబరు 1ని సెలవుదినంగా ప్రకటించ లేదు. సంక్రాంతి పండుగలకు నాలుగు రోజులు సెలవులుగా ప్రకటించడం విపరీతంగా వున్నది. భోగి, సంక్రాంతి, కనుమ పండుగలకు 13, 14, 15 (జనవరి) తేదీలు సెలవు దినాలుగా ప్రకటించిన చాలును. 16 వ తేదీ సెలవుఇవ్వనవసరం లేదు. ఈ సెలవు రద్దుచేసి అక్టోబరు 1 న సెలవు ఇవ్వడంగురించి ప్రభుత్వం ఆలోచించగలదని ఆశిస్తున్నాము.

అలాగే పొట్టి శ్రీరాములు గారి నిర్యాణదినం డిసెంబరు 15 ను పండుగదినము లలో చేర్చక వారి జన్మదినాన్ని చేర్చడం వాంఛనీయం డిసెంబరు 15 వ తేదీ ఆంధ్రులకుపండుగరోజు ఎన్నటికీ కాదు; కారాదు. అది మనకు మన కర్తవ్యాన్ని బోధించే పవిత్రదినంకాగలదు సెలవు లేకనే ఆరోజును "శ్రీరాము దినం"గా పరిగణించడం వాంఛనీయం. గాంధిజీ నిర్యాణదినం జనవరి 30 ఆరోజున భారతీయులు మహాత్ముని స్మరించిన విధంగా నే డిసెంబరు 15 న ఆంధ్రులు 'అమరజీవి'ని స్మరించాలి

ఈ రెంటినీ ఆంధ్ర ప్రభుత్వం సవరించగలదని ఆశిస్తున్నాము.

ఇక పండుగల పేర్లను ప్రకటించడంలో ఆంధ్ర సంప్రదాయాన్ని అనుసరించడడంమంచిది. 'ఆయుధపూజ' అని మూడు రోజులు ప్రకటించడంకంటే దుర్గాష్టమి, మహార్నవమి, విజయదశమి అని పేర్కొని యుండవలసింది. ఈ మార్పులను వీలైనంత త్వరలో ఆంధ్ర ప్రభుత్వం చేయగలదని ఆశిస్తున్నాము.

## పారిశ్రామిక తగాదాల పరిష్కారం

### సమష్టి సంప్రతింపుల పద్ధతి విషయమై ప్రభుత్వ పరిశీలన

న్యూఢిల్లీ, డిసెంబరు 8: పారిశ్రామిక తగాదాల పరిష్కారం సందర్భంలో ఉభయవర్గాల సంప్రతింపుల పద్ధతి విజయవంతంగా అమలు జరగడంలో కనిపిస్తున్న చిక్కులను తొలగించే విషయమై వచ్చిన సూచనలను ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నదని ఇవ్వాళ ప్రజాసభలో కార్మిక ఉపమంత్రి ఆబిద్ అలీ తెలిపారు.

నిరుడు జనీవాలో జరిగిన 86-వ అంతర్జాతీయ కార్మికమహాసభ తీర్మానించిన కట్టుబాట్లు, చేసిన సిఫార్సులపై భారతప్రభుత్వం తీసుకోదలచిన చర్యలను వివరిస్తూ ఈయన ఇవ్వాళ సభవారికొక ప్రకటన అందచేశారు. అందులో ఈ విషయం తెలిపారు.

అం. కాం. మహాసభ (1) వ్యవసాయ కూలీలను జీతంతో కూడిన సెలవులు, (2) సాంఘిక భద్రత కనీస ప్రమాణాలు, (8) ప్రసూతి రక్షణ సరించి కట్టుబాట్లు తీర్మానించింది. వ్యవసాయకూలీల సెలవులు, యజమానులు కార్మికులమధ్య సహకారం సంప్రతింపులు, ప్రసూతి రక్షణల సరించి సిఫార్సులు చేసింది. వీటిలో వేటినీకూడా భారతప్రభుత్వం ఆమోదించ లేదు. కాని సాంఘిక భద్రత, ప్రసూతి సౌకర్యాల విషయాన్ని మాత్రం పరిశీలించ దలుస్తున్నది. అని ఆ ప్రకటనలో తెలుపబడింది.

## హైద్రాబాద్‌లో చౌకగా గోధుమలు అమ్మకం

హైదరాబాదు, డిసెంబరు 8: ఆహార నుకాణాల ద్వారానూ, ప్రైవేటుదుకాణాల ద్వారానూ తెల్లవి ఫిరలకు హైదరాబాదు, సికిందరాబాదులలో అమ్మకానికై భారత ప్రభుత్వంవారు 2 వేలటన్నుల గోధుమలు విడుదల చేసినట్లు అధికార వర్గాలద్వారా తెలియవచ్చింది.

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో ఈ గోధుమల టోకు అమ్మకం ధర పల్లపు వసయి సిద్ధంగుల వారి మాటాండగా రూ. 15-10-10 గానూ చిల్లర దుకాణాలలోనూ, ప్రైవేటు దుకాణాలలోనూ చిల్లర అమ్మకం ధర మణుగుకు రూ. 16-4-0 గానూ, సేరుకు రూ. 0-6-6 గానూ ఉంటుంది.

## జనవరి 15 న ఢిల్లీకి సింహళ ప్రధాని రాక

### జరగబోయే చర్చల ధోరణి గురించి రాజ్యసభలో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 8: సింహళ ప్రధాని సర్ జాన్ కొటెలవాలా జనవరి 15 ప్రాంతాల్లో ఢిల్లీ వస్తారనిఅనుకొంటున్నట్లు ప్రధాని నెహ్రూ ఇవ్వాళ రాజ్యసభలో తెలియచేశారు.

సింహళభార్య ప్రధాని సేనానాయకే తిమరూ ఉభయ దేశాలసమస్యల గురించి లండన్లో జరిగిన సంప్రదింపులను కొనసాగించడానికి తామూ ఆయనను ఆహ్వానించారనీ, సింహళప్రధాని ఆ ఆహ్వానాన్ని అంగీకరించినట్టున్నాడనీ నెహ్రూ అన్నారు. సింహళంలోని భారతీయ సంతతివారి భవిష్యత్తుకు సంబంధించిన సర్వవిషయాలనూ ఆయనలో చర్చించుతామనీ మొట్టమొదట నిర్ణయించవలసినది సింహళ జాతీయులు ఎవరూ, కానివా రెవరు-అన్నదేననీ అక్కడి భారతీయ సంతతి వారంతా భారతీయులు అనగా, భారత జాతీయులు కారనీ, భారతప్రభుత్వం సింహళజాతీయులని భావించినవారిని ఆప్రభుత్వం అభిరంగాఎంచకపోవడం వల్లనే ఇదివరకు చిక్కు వచ్చిందనీ ప్రధాని అన్నారు.

## సింకియాంగ్‌తో భారతదేశ వ్యాపారం

### నిలుపుదలపై రాజ్యసభలో ప్రధాని ప్రకటన

న్యూఢిల్లీ, డిసెం 8: సింకియాంగ్ నిషిద్ధప్రాంతం అనే కారణాన అక్కడ మన ప్రతినిధి వుండడానికి చైనా అభ్యంతరం చెప్పిందని ప్రధానమంత్రి నెహ్రూ ఇవ్వాళ రాజ్యసభలో తెలియచేశారు. అక్కడిప్పుడు విదేశ ప్రతినిధులెవరూ లేరన్నారు.

అక్కడ మన ప్రతినిధి కార్యాలయం 1948 డిసెంబరులో అప్పటి చైనాప్రభుత్వ సమ్మతితో ఏర్పాటు చేయబడింది. 1949 అక్టోబరులో ఆ ప్రభుత్వం ఏర్పడింది. అప్పుడు చైనాలో మన ప్రతినిధుల కార్యాలయాల భవిష్యత్తు ఆలోచనకు వచ్చింది. షాంఘైలో మన ప్రతినిధి కార్యాలయం వుండటానికీ, కలకత్తాలో చైనా ప్రతినిధి కార్యాలయం వుండటానికే ఒప్పందం కుదిరింది. సింకియాంగ్ తో వ్యాపారం కొంచెమే అయినా అక్కడకూడా మన ప్రతినిధి కార్యాలయం వుంచటానికి అనుమతికోరగా, చైనా ప్రభుత్వం అక్కడ ఎవరినీ వుండనివ్వమన్నారు. అయినా మొన్న మొన్నటి వరకూ ఇదనిర్దిష్టమైన బాధ్యతాధికారాలు లేకుండా నే మన ప్రతినిధిని అక్కడ వుంచాము. ఆయన వచ్చేటప్పటికి అక్కడ మనదేశస్థులెవరూ లేకుండా పోయారు. దానితో ఈ కార్యాలయం మూసివేశాము. అయితే మనకింకా అక్కడ భవనాలు మొదలైనవి వున్నాయి. వాటిని మనతరఫున చైనాప్రభుత్వం కనిపెట్టి వుంటోంది. అని నెహ్రూ వివరించారు.

ప్రపంచంలో మరెక్కడైనా ఇట్లా మనని కాదన్న వారున్నారా అనీ, భారతీయ వర్తకులు ఏ పరిస్థితులలో అక్కడినుంచి వచ్చి వేయవలసి వచ్చిందనీ ఒకరు అడిగారు.

ఒక ప్రాంతాన్ని 'నిషిద్ధం' గా ఎంచినప్పుడు ఇటువంటివి జరగటంలో అసాధారణం ఏమీ లేదనీ, మనంకూడా కొన్నిచోట్ల కొందరు ప్రతినిధి కార్యాలయాలు పెట్టుకోవటానికి ఒప్పుకోలేదనీ నెహ్రూ జవాబు చెప్పారు. ప్రశ్నలో రెండవభాగానికి జవాబుగా, అక్కడ వ్యాపారం లేనందువల్ల నే నన్నారు.

## కాశ్మీర్‌లో బక్షీ ప్రభృతుల కృషి

### సదరీ రియాసత్ ప్రశంస

జమ్మూ, డిసెంబరు 8: బక్షీ గులాం మహమ్మద్ ఆయన సహచరులు కాశ్మీర్ సంస్థాన ఆర్థికపరిస్థితులను బాగుపరచేందుకు చేస్తున్న కృషిని సదరీ రియాసత్ యువరాజ్ కరన్ సింగ్ ప్రశంసించారు. గడచిన నాలుగుమాసాలలో వారు సాధించింది విశేషమునీ, అంతకుముందటి మాసాములలో సంస్థాన సమైక్యతకు ఏమీ ముప్పు వాటిల్లుతుందో అని భయంకల్పించిన పరిస్థితి తొలగిపోయి, తిరిగి మామూలు పరిస్థితి ఏర్పడిందనీ, నేడు జమ్మూ, కాశ్మీర్, లడక్ ప్రజలంతా కూడా ఒక్కటిగా అభివృద్ధి పథంలో ముందడుగు వేయగలమనే ధైర్యంతో వున్నారనీ ఆయన అన్నారు. పరిష్కారం కావలసిన సమస్యలు ఇంకా చాలావున్నమాట నిజమేననీ, అవి కూడా క్రమేణా పరిష్కార మవుతాయన్న నమ్మకం తమకున్నదనీ కూడా అన్నారు.

యువరాజ్ పఠాన్‌కోటుకు ఆదివారంనాడు ఢిల్లీ వెడుతున్నారు. అక్కడ, వారంరోజులుండి ప్రధానమంత్రి నెహ్రూ ప్రభృతులను కలుసుకొంటారు. జనవరిలో బొంబాయి, మద్రాసు, కలకత్తా ప్రాంతాలకు యాత్ర వెళ్ళనున్నారు.

## స్థానికాభివృద్ధి సాధనలో ప్రజలు సహకరించాలి

### చిత్తూరు నీటిసప్లయి ప్రణాళిక ప్రారంభోత్సవ సభలో మంత్రి సంజీవయ్యగారి హితవు

చిత్తూరు, డిసెంబరు 8: ప్రతిపనికీ ప్రభుత్వంమీద ఆధారపడడంకంటె నీటిసప్లయి ప్రణాళికలవంటి వాటిని అమలుజరపడంలో స్థానిక భాగ్యవంతులు ప్రభుత్వంతో సహకరించడం ప్రథమ కర్తవ్యమని స్థానికంగుమంత్రి సంజీవయ్యగారు నేడీ పట్టణంలో నీటిసప్లయి ప్రణాళికకు ప్రారంభోత్సవం జరుపుతూ అన్నారు. సభకు మంత్రి తిమ్మారెడ్డి గారు అధ్యక్షత వహించారు.

చిత్తూరు ప్రజల సౌకర్యార్థంమంచి నీటిని సరఫరా చేయుటకుగాను విరాళిచ్చి చిత్తూరులో నీటి సరఫరా ప్రణాళికను అమలు జరపవలసిందిగా కోరుతూ పురపాలకసంఘంవారు పలుసార్లు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసుకొన్న ఫలితంగా ప్రభుత్వం 2 సంవత్సరాలకు ముందు ఈ ప్రణాళికను ప్రవేశపెట్టి పనులు పూర్తిచేసి పట్టణంవరకు నీటి గొట్టములను వేయించి తిర్వాతా నగరంలో కొంత భాగానికి మాత్రం నీరు సరఫరా అయ్యేటట్లు చేసి, డబ్బు లేనందునను, పరికరములు దొరకనందునను నీటిని పురమునకంతా సప్లయి చేయడాన్ని నిలిపి యుండినది.

ఈ పరిస్థితిలో పురపాలక సంఘంవారు కొంత సైకమును ప్రత్యేకించి దానితో పట్టణంలోని మిట వీధులలోని ప్రజలకు నీటిని సరఫరా చేయవలెనని, తీర్మానించి ప్రభుత్వంవారి అంగీకారంపై పగర ముఖద్వారంవరకు వేయబడిన నీటిగొట్టాలను పొడిగించి నీటి కొరతగల ప్రాంతాలలో కొళాయిలను పెట్టించి తాత్కాలికంగా మంచినీటిని సరఫరా చేయ నిర్ణయించారు. ఈ కార్యక్రమానికి గా॥ మంత్రి సంజీవయ్యగారీ వేళ ఉదయం 9 గంటలకు ప్రారంభోత్సవం జరిపారు. శ్రీరాములవారి గుడివీధిలో మంత్రి ప్రారంభోత్సవం చేసిన కొళాయితో పాటు మరి 10, కొళాయిలున్నూ యీ వేళ తెరువబడినవి.

ఈ ప్రారంభోత్సవ కార్యక్రమాన్ని జరుపుటకై మునిసిపల్ హైస్కూల్ ఎలిమెంటరీస్కూలులో సభఏర్పాటు చేయబడినది. గా॥ శ్రీ తిమ్మారెడ్డిగారు సభకధ్యక్షత వహించారు. ఆ సభకు కలెక్టరు మున్నగు అధికార్లు, పాలకల రామచంద్రా రెడ్డి, ఎన్. పి. చంగ్రాయ నాయుడు ప్రభృతిఅనధికార్లును ఛైర్మెన్ రత్నాబాయమ్మగారు, వైస్ ఛైర్మెన్ లోకనాథాచారిగారూ, పురపాలక సంఘసభ్యులు, ఇతరేతర పౌరులున్నూ హాజరయినారు. మంత్రులు రాగానే వారికి స్వాగతమివ్వబడింది. కౌన్సిలరు శ్రీ సి. వి. శ్రీనివాసముదలిగారు మంత్రులకు పుష్పమాలను సమర్పించారు. బాలికలు ప్రార్థనగీతములు పాడారు. తర్వాత, ఛైర్మన్ రత్నాబాయమ్మగారు చిత్తూరు ప్రజలకు మంచినీటి వసతిని కల్గించుటకు నీటిసప్లయి ప్రణాళిక పనులుజరిపి త్వరలో ప్రణాళికను పూర్తిచేసినందుకు ప్రభుత్వానికి, ప్రభుత్వ ఇంజనీర్లకున్నూ కృతజ్ఞతాభివందనలు తెలుపుతూ, గా॥ మంత్రి సంజీవయ్యగారిని నీటి కొళాయిలను ప్రారంభింప గోరిరి.

అధ్యక్షులు గా॥ తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ మాజీఛైర్మన్ శ్రీ రఘుపతిశెట్టిగారు, మాజీకౌన్సిలర్లు, ఇప్పటి ఛైర్మన్, కౌన్సిలర్లుయొక్క కృషి ఫలితంగా ప్రభుత్వం ఈ విధానాన్ని ప్రవేశపెట్టి 3 సంవత్సరాల్లో చిత్తూరు ప్రజలకు మంచినీటి వసతిని కల్పించినందుకు సంతోషాన్ని తెలుపుతూ తాముకూడా ఈ పనిని పూర్తిచేయుటకు శక్తివంచనలేక సహాయంచేసెదనని, హామియిచ్చి శ్రీ సంజీవయ్యగారిని నీటి కొళాయిని ప్రారంభింప కోరినారు.

పిదప, గా॥ సంజీవయ్యగారు చిత్తూరులో ప్రవేశపెట్టబడిన ఈ మంచినీటి సరఫరా విధానంవల్ల ప్రజలారోగ్యవంతులుగా అయ్యేటట్లు చేయుటకు, ఈ పథకం ఫలప్రదంగాచేయ్యాలనీ విజ్ఞప్తిచేస్తూ, నీటికొళాయిని తెరచి విడుచుచు, నేటి పత్రికాస్థులకు ప్రజలు ప్రభుత్వం మీదనే ఆధారపడక స్థానికులైన ధనవంతులు ముందుకువచ్చి విరాళాలు చేసేటట్లు ప్రయత్నిస్తే బాగుంటుందని ఇదిచేయలేదు. అదిచేయలేదు అని, బాధ్యతారహితంగా ప్రభుత్వాన్ని విమర్శించుటకంటే, నేటి ప్రణాళికలు ఫలప్రదమగుటకు ప్రభుత్వంతో సహకరించడం ప్రజల ప్రథమ కర్తవ్యమని అన్నారు.

మునిసిపల్ కౌన్సిలరు శ్రీ ఎస్. రాజశేఖర రెడ్డిగారు కృతజ్ఞతాభివందన సమలతో సభ ముగిసింది.

### మంత్రులకు విందు

ఛైర్మెన్ రత్నాబాయమ్మగారు మంత్రులకు ఈరోజు మధ్యాహ్నం విందు ఏర్పాటు చేశారు. నేటి ఉదయం 8 ఘంటలకు మంత్రి సంజీవయ్యగారు చిత్తూరు పరిసరంలో కొత్త పంచాయతీ ...... కాణిపాకపట్టణం గ్రామానికి వచ్చి, గ్రామపంచాయతీబోర్డు వ్యవహారాలను పరిశీలించారు.

## రిజర్వుబ్యాంక్ సవరణ చట్టం

### ప్రజాసభ ఆమోదము

న్యూఢిల్లీ, డిసెంబరు 8: ప్రజాసభవారు ఈ వేళ రిజర్వుబ్యాంకు సవరణ బిల్లును ఆమోదించారు.

వ్యవసాయదార్లకు నాతి దీర్ఘకాల పరపతిగా 5 కోట్లరూపాయలు ప్రత్యేకించడానికి ఈ బిల్లు యేర్పాటు చేస్తున్నది. పెద్దనోట్ల జారీకి కూడా అనుమతి యిస్తున్నది.

వ్యవసాయదార్లకు ఋణాలుయిచ్చే నిమిత్తం ప్రత్యేకించిన ద్రవ్యాన్ని 5 కోట్లనుండి 25 కోట్లకు పెంచాలని ప్రతిపక్షవర్గం ప్రతిపాదించిన సవరణ వీగిపోయింది.

### కేరళ హైకోర్టు సవరణ బిల్లు

తరువాత సభవారు మూడుగంటల చర్చానంతరం తిరువాన్కూరు-కొచ్చిన్ హైకోర్టు సవరణ బిల్లును ఆమోదించారు. త్రివేండ్రంలో ఆ హైకోర్టు బెంచి స్థాపించడమే ఈ బిల్లు ఉద్దేశ్యము. ఈ బిల్లును కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు గత ఏప్రిల్ 9 న ఆమోదించింది.

కేవలము పరిపాలనా సంబంధమైన విషయాల్లో భారతప్రధాన న్యాయమూర్తి అభిప్రాయం వెలిబుచ్చడం ఉచితమా అనే విషయం తెలపని దలంపుగా ఈ బిల్లు చర్చ సమయమున ఉత్పన్నమైంది. ఈ సూచనకు ప్రతికూలంగా అభిప్రాయం వెలిబుచ్చుతూ భారతప్రధాన న్యాయమూర్తి ఎర్నాకులంలో చేసిన ఉపన్యాసమును మీరు చూచారా? అని శ్రీ ఎన్. సి. ఛటర్జీ డా॥ కట్జూను అడిగారు.

డా॥ కట్జూ ఇలా అన్నారు. భారత ప్రధాన న్యాయమూర్తి అభిప్రాయాలు వెలిబుచ్చడం ఉచితమా? కాదా అనే విషయమై నేను అభిప్రాయం తెలపజాలను. ఈ అభిప్రాయాలనుబట్టి నేను వ్యవహరించను. ప్రధాన న్యాయమూర్తి అమ్మకం పన్ను విధించాలని, ఎక్సైజ్ సుంకాలు విధించాలని చెప్పవచ్చు, మద్యపాన నిషేధానికి అనుకూలంగా గాని ప్రతికూలంగాగాని అభిప్రాయం వెలిబుచ్చవచ్చు. అంతిమ నిర్ణయం మంత్రివర్గానిదే. పరిపాలనా సంబంధములైన విషయాల్లో నిర్ణయాలు చేసే కర్తవ్యము కార్యవర్గమువారిది, శాసన సభవారిదీ అయివున్నది. ఇట్టి విషయాల్లో న్యాయమూర్తులను వివాదాలకు అతీతులనుగా వుంచాలి."

చర్చలో ప్రతిపక్షవర్గ సభ్యులు కొందరు ప్రభుత్వానికి రాజకీయోద్దేశములను ఆరోపించినందులకు డా॥ కట్జూ సంతాపం వెలిబుచ్చారు. పరిపాలనా సంబంధములయిన కారణాలవల్లనే త్రివేండ్రమ్‌లో హైకోర్టు బెంచిస్థాపన జరుగుతున్నదని ఆయన తెలిపారు.

సభవారు బిల్లును ఆమోదించారు. సభ రేపటివరకు వాయిదాపడింది.

## నంద్యాలలో ఇండ్ల కొరత

కర్నూలు, డిసెంబరు 9: కర్నూలు నుంచి జిల్లా ప్రభుత్వ కార్యాలయాలను కర్నూలుకు తిరలించినందున ఆపట్టణంలో ఇండ్లకొరత చాలా ఎక్కువైనది. నంద్యాల గృహనిర్మాణ సహకార సంఘంవారు ఇంతవరకు ఇండ్ల నిర్మాణానికి పూనుకోనలేక పోయారు. అక్కడి జిల్లా ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే ఉద్యోగులలో ఎక్కువమంది ఇంకా తమ కుటుంబాలను కర్నూలులోనే అట్టే పెడుతున్నారు. రెండువందల ఇరవై యిండ్ల నిర్మాణానికి కావలసిన అప్పు మంజూరు చేయవలసిందిగా నంద్యాల గృహ నిర్మాణ సహకార సంఘం వారు ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టారని ముఖ్యమంత్రి నవంబరు మొదటి తేదీన ప్రకటించినమాట పాఠకులకు తెలిసినదే. ఈ ఆర్థిక సంవత్సరం పూర్తయ్యేలోగానే ఇండ్లన్నింటి నిర్మాణం పూర్తికావలసి వున్నది. ఆంధ్ర ప్రాంతంలో తగినంత మంది సమర్థులైన కంట్రాక్టర్లు దొరక్కపోవడమే యీ ఆలస్యానికి కారణమని తెలుస్తున్నది. కర్నూలులో తలపెట్టబడిన ఇండ్ల నిర్మాణం కూడా ప్రభుత్వానికొక సమస్యగా వున్నది. ఈయిండ్ల నిర్మాణం కంట్రాక్టర్ల చేత చేయించాలా లేక ప్రభుత్వమే దగ్గరుండి చేయించాలా అనే విషయంలో ప్రభుత్వం ఇంకా యేమీ నిర్ణయించుకోనలేదు. (ఆం. ప. వి.)

## సంపాదకునకు లేఖలు

### నాగుల్లంక-గన్నవరం రోడ్డు వెడల్పు చేయాలి

అయ్యా, నాగుల్లంకనుండి గన్నవరం అక్విడెక్టువరకూ రమారమి మూడు మైళ్ళు దూరమున్నది. ఈ రోడ్డు ఇఱుకుదగుటవలన తప్పుకోనుటకు యిరుకైన పడవల కాలువకు అనుకొనివున్నది.

ఈ కారణమువల్ల వచ్చేపోయే బస్సు తప్పుకొనుటలో ఒలిక్రిందులై ప్రక్కనేవున్న పడవల కాలువలో పడిపోవడం సంభవిస్తున్నది. ఇటువంటి సంఘటనలలో తరుచూ ప్రాణనష్టాలు కూడ కలుగుతున్నవి.

కార్లు పల్టీలు కొట్టడం, సజ్జబళ్ళు తల్లక్రిందులై గుర్రాలు చచ్చిపోవడం, అనేక సందర్భాలలో కొంతమంది మరణించడంలాటి సంఘటనలు యిప్పటికి యెన్నో జరిగినవి. పట్టపగలే ఆ రోడ్డున ప్రయాణముంటే అందరికీ అరుదుగా వుంటుంది. యిక రాత్రులందు సరేసరి.

1945 వరకు డబ్బుతిన్న గన్నవరం అక్విడెక్టును ప్రభుత్వం మరమ్మతు చేయుటకు పూనుకొన్నది. అతిరుణంలో నే అక్విడెక్టుకు కలిపి వెడల్పైన వంతెనకూడ నిర్మించడం జరిగింది. సుమారు 26,00,000 రూపాయిలు ఖర్చించి "అక్విడెకురోడ్డు" కట్టబడినా గన్నవరం-నాగుల్లంక రోడ్డు యిరుకైన కారణంగా దానికి యిప్పటికి ప్రాధాన్యత రాలేదు.

సెంట్రల్ డెల్టాలో ప్రయాణాలు తేలికగా సాగుటకు యీ మూడు మైళ్ళరోడ్డు మాత్రమే అవరోధాన్ని కలిగిస్తున్నది. బస్సురూట్లు ప్రకటించబడికూడ యీ రోడ్డు వెడల్పు తక్కువై సంభవిస్తున్న ప్రమాదాలను పురస్కరించుకొని బస్సులు నడపబడక నిలిచిపోయినవి. ఫలానావారికి ఆ రూటు యివ్వబడినట్టుకూడ ప్రకటించలేదు.

ఈ విధంగా సఖినేటిపల్లి - బొబ్బర్లంక, సఖినేటిపల్లి-పల్లంకుర్రు, సఖినేటిపల్లి-ముక్తేశ్వరం, సఖినేటిపల్లి నుండి మురమళ్ళ రూరాలకు బస్సులు నడచుటకు అభ్యంతరమును ప్రభుత్వం చెపుతున్నది.

గన్నవరం-నాగుల్లంకరోడ్డు తూ. గో. జిల్లాబోర్డుది. యే కారణంచేతనో యిన్నాళ్ళమండీ కూడ దాని వెడల్పు పెంచుటకు యే విధమైన ప్రయత్నమూ జరుగలేదు. ఇన్నాళ్ళనుండి జరుగని యీ పని యిప్పట్లో తూ. గో. జిల్లాబోర్డు సాధించగలుగుతుందనే విశ్వాసంలేదు.

హైవేస్ కి చెందిన కత్తిపూడి-సఖినేటిపల్లిరేవురోడ్డు అమలాపురంనుండి పాశర్లపూడి రేవు మీదుగా మైలేజీ లెక్కింపు జరుగుతున్నది. నిజానికి అదే హైవేస్ రోడ్డుకూడా.

ఐతే 26,00,000 రూపాయిలఖర్చు చేసి నిర్మించిన వంతెన ప్రయోజనం కావాలంటే, వంటనే గన్నవరంమీదుగా బస్సులు నడిచేందుకైనా అమలాపురంనుండి రాజోలుకి మైలుదూరంలోవున్న పొదలాడవరకూగల రోడ్డును సామమాత్రంగా హైవేస్‌లోకి చేర్చడం అవసరం.

ఇది జరగడంవల్ల గన్నవరం-నాగుల్లంకరోడ్డు వెడల్పు అగుటకు అవకాశం కలుగుతుంది. మరమ్మతు కావలసిందికూడ ఆ మూడుమైళ్ళ రోడ్డే. పాశర్లపూడిరేవు దాటనక్కరకుండా నిమిషాలమీద ప్రయాణం సాగుటకు నాగుల్లంక-గన్నవరంరోడ్డు పెంపు అవసరం. దీనికై ప్రభుత్వం వెంటనే తగు చర్య తీసికోవాలని కోరుతున్నాను.

మోరి, గోపరాజు సుందరరావు.

### పాఠ్య గ్రంథములు

అయ్యా, విశ్వకళా పరిషత్తులో పాఠ్య గ్రంథములుగ నిర్ణయింపబడినవి ఆకర్షణీయముగా నుండుటలేదు. బోర్డు ఆఫ్ స్టడీస్ వారికి పంపించునపుడు చక్కని తెల్లకాగితములపై ముద్రింపబడి ముచ్చటగా తగిన పలకు దొరయకు నవిగా వుండును. కాని పాఠ్యగ్రంథములుగ నిర్ణయించుటతోడనే ధర పెరిగిపోవుట, పీచుకాగితముపై ఇ. బి. టైపులలో కొన్ని అక్షరములు నుర్తుపట్ట లేవంతిగా వుండును. దీనివలన పాఠము చెప్పుటకు యిబ్బంది కలుగుచున్నది.

ఆంగ్ల ప్రకాశకుల పద్ధతులు అనుసరింపవలెను. వారి పాఠ్యగ్రంథములు అర్హమైన వెలకు అందముగ ముద్రింపబడియుండును. కనుక తెలుగు పుస్తకములు కూడ జి. పి. ట్రయిల్ 24 పాయింటు టైటాఫర్ లైట్ గ్లేజ్ ప్రింటింగు పేపరుపై ముద్రింపబడు యేర్పాట్లు గావింపబడవలెను.

ఏలూరు. ఉప్పలపల్లి నాగగోపాలరావు.

### రేడియోలో 'బజారుధరల ప్రకటన'

అయ్యా! ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాతకూడా ఇంకా తెలుగు గ్రామస్థుల కార్యక్రమంలో బజారుధరలు చెప్పేటప్పుడు "మన మద్రాసు రాష్ట్రంలోని కొన్ని ముఖ్యపట్టణాలలో ధరలు ..... కొనితాయి....." అని అంటున్నారు.

ఈ సమయాన్ని రేడియో అధికారులు సవరించగలరా?

కర్నూలు. రేడియోశ్రోత,

### పొగాకు వ్యాపారంలో విపరీత మాంద్యం

అయ్యా, ఆంధ్రప్రభుత్వం పొగాకు వ్యాపార విషయమై శ్రద్ధవహించకుంటే పొగాకునిల్వలు విడుదలయ్యేటట్లు చూడకపోతే వేలాదికుటుంబాల ఆర్థికజీవనం విచ్ఛిన్నమయ్యే ప్రమాద పరిస్థితియేర్పడుతుంది. గుంటూరు జిల్లాలో వ్యాపార పంటలలో ప్రధానమైనది పొగాకు. యీ జిల్లానుండి ప్రతి సంవత్సరం కొన్ని కోట్ల రూపాయల విలువచేసే పొగాకు యితర దేశాలకు ఎగుమతి అవుతూవుంటుంది. దానిలో ఎక్కువభరీదుచేసే మంచి రకాలు (1 నెం నుండి 4 నెం) పొగాకు లండనుకు ఎగుమతి అవుతుంది. తక్కువ రకం పొగాకు కాంటినెంటల్ దేశాలకు, చైనా రష్యా, జపాన్, దేశాలకు ఎగుమతి అవుతూవుండేది. కాని యీ సంవత్సరము పకాలములో వర్షములు కురవనందున మంచిరంగులురాక లండన్‌కు ఎగుమతి అయ్యే మేలురకం పొగాకు వుత్పత్తి అయిన పంటలో తక్కువభాగము మాత్రమే వుంది. దానివల్ల లండన్‌కు ఏటా ఎగుమతి అయ్యేటంత కాలేదు. పోతే పంటలో ఎక్కువభాగము వేలిన తక్కువ రకం పొగాకు యింతవరకు రష్యా చైనాలు గాని, ఏ యితర దేశాలుగాని కొనటం జరగలేదు. జపాన్ దేశము గత సంవత్సరం కొన్న దానికంటె తక్కువ మొత్తాన్ని మాత్రం కొన్నది. దానివల్ల దాదాపు 2 కోట్లరూపాయలకు పైగా విలువచేసే పొగాకు యీరోజు వరకు నిల్వయుండిపోయి, మధ్యతరగతి వ్యాపారస్థులు, రైతులవద్ద డబ్బులేక నానాబాధలు పడుచున్నారు. యింట్లో ఏదైనా నగలుంటే 1-0-0-0-1-0 చొ॥ వడ్డీ కుదువపెట్టి అవసరాలు గడుపుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. మధ్యతరగతి వ్యాపారస్థులు రైతులకు, గ్రేడింగు కార్మికులకు, యివ్వవలసినడబ్బు యివ్వలేక చాటుగా తలదాచుకోవలసిన హీనపరిస్థితిలోవున్నారు. పొగాకు లైసెన్సులు పునరుద్ధరించవలసిన సమయం దాటిపోయినా ఎంతోమంది వ్యాపారస్థులు డబ్బులేక పునరుద్ధరించుకోనలేక పోయారు. ఏదో ఒక ధరకు పొగాకు అమ్ముదామన్నా కొనేవారెవ్వరు అగుపించరు. ఉదా 1951 లో 100 రూ. అమ్మిన మొద్దు పచ్చి యీ సంవత్సరం 10/- కొనే వారు లేరు. మిగతా రకాల పరిస్థితి కూడా యిట్లాగే యున్నది. యీ పరిస్థితి కొనసాగితే ఎంతో మంది మంది వ్యాపారస్థులు, రైతులు, దివాలా ఎత్తవలసినప్పటికీ ఆశ్చర్యం లేదు. దానితో మార్కెట్టులో యీ యీ వ్యాపారస్థులు లేకుండాపోయి ఐ. యల్. టి. డి. కంపెనీలాంటి గుత్త వ్యాపారసంస్థలు మాత్రమే మిగిలి 1954 సం॥ పంటకు మొదటినుండి ధరలలో మాంద్యము ఏర్పడి రైతులు ఎంతో బాధపడవలసివస్తుంది. (ఉదా: యింతకుముందు సంవత్సరాలలో వ్యాపారంలో మాంద్యము ఏర్పడకుండా వుండే వ్యాపారస్థులందరు మార్కెట్టులో వున్నప్పుడు ఎండుకర్ర నియా పొగాకు పుట్టి 1 కి రు 250/- వరకు ఖరీదుచేసిన ఐ. యల్. టి. డి. యీ సంవత్సరం యితర వ్యాపారస్థులు కొన్నరకే యీ రకము పొగాకు ఎగుమతి పరిస్థితులు లేకపోవటంవల్ల తేను పుటి 1 కి రు 25/-నుండి రు 100/- వరకు మాత్రమే కొన్నది). కనుక వ్యాపారఋణంబడికలలో మన దేశం నుండి ఎగుమతిఅయ్యే సరుకులలో ముఖ్యభాగముగా పొగాకును చేర్చులాగున ఆంధ్రప్రభుత్వం ప్రయత్నించవ ప్రార్థించుచున్నాను. ఆంధ్ర దేశము నుండి ముఖ్యంగా గుంటూరుజిల్లానుండి ఎన్నికైన పార్లమెంటు సభ్యులు యీ విషయంలో శ్రద్ధవహించుతారని నమ్ముచున్నాను.

శ్రీ కృష్ణం వెంకటేశ్వర్లు. చిలకలూరిపేట.

### వినోద ప్రయాణీకులకు సౌకర్యాలు కల్పించాలి

అయ్యా, ఆంధ్రలో వినోద ప్రయాణం (టూరిస్టు ట్రాఫిక్) అభివృద్ధి పరచుటకు అనువైన అనేక తావులు విశాఖజిల్లాలో చింతపల్లి బొర్రా గుహలవనంగు వేటకు ప్రసిద్ధి చెందినవి. అనంతగిరి, అరకు లోయలు చూడదగ్గవి. అమరావతి బౌద్ధ శిల్పాలు, స్తూపాలు ప్రసిద్ధి చెందినవి. ఇలాగే తిరుపతి, సింహాచలం దేవాలయాలు, దుడుమా హైడ్రో-ఎలెక్ట్రిక్ ప్రాజెక్టు ఎంతోమందిని ఆకర్షిస్తాయి. ప్రయాణీకులకు తగు సౌకర్యాలు కలుగజేసి, యీ స్థలాలను అభివృద్ధి పరచితే ఎంతో మంచిది. ఇందు నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం టూరిస్టుబోర్డును స్థాపించాలి. ప్రయాణీకులకు మార్గదర్శకులను నియమించాలి. రైల్వేల మంత్రిత్వశాఖవారితో ప్రభుత్వం యీ విషయమై సంప్రతింపులు జరపాలి

మద్రాసు. బుద్ధవరపు రంగారావు.

మైసూరు, డిసెంబరు 8: మైసూరు నగర మున్సిపల్ ఎన్నికలలో కాంగ్రెస్ 100 కి 50 పంతుల స్థానాలను ఆక్రమించుకున్నది. మొత్తం 40 స్థానాలలో కాంగ్రెసు 20, పి. ఎస్. పి. 10, ఇతరులు 10 స్థానాలను గెల్చుకొన్నారు. ..... రెండు స్థానాలకు పోటీ చేసి రెంటిలోనూ ఓడిపోయారు.

